శ్రీ శుభమస్తు.

# రుక్మాంగద మహారాజ చరిత్రము.

అనగా

## ఏకాదశీ మాహాత్మ్యము

ఇత్యాది

విశాఖపట్టణము జిల్లా అనకాపల్లి వాసుండగు

బీ బాలాజీదాసునిచే

వ్రాయఁబడినది.

9 వ కూర్పు 1000 ప్రతులు.

ప్రకటనకర్త:

కురుకూరి సుబ్బారావు,

సరస్వతీ బుక్కు డిపో, బెజవాడ, కృష్ణాజిల్లా.

బెజవాడ:

ఆంధ్రవాణీ ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడియె.

Reprint.

1939



Price Re. 0-8-0 వెల రూ. 0-8-0

# హెచ్చరిక.

ఆదిభట్ల నారాయణదాసుగారిచే రచియింపబడిన హరికథలు
అన్నియు మావద్ద విక్రియింపఁబడును.

| | |
|---|---|
| జానకీ శపథము | 1— 0—0 |
| రుక్మిణీ కల్యాణము | 0—12—0 |
| మార్కండేయ చరిత్రము | 0—12—0 |
| హరిశ్చంద్రోపాఖ్యానము | 0—12—0 |
| అంబరీష చరిత్రము | 0— 8—0 |
| భీష్మ చరిత్రము | 0— 8—0 |
| గజేంద్ర మోక్షణము | 0— 8—0 |
| ప్రహ్లాద చరిత్రము | 0— 8—0 |
| పై యెనిమిది పుస్తకములుగల క్యాలికో బయిండు | 5— 8—0 |
| యథార్థ రామాయణము | 2— 8—0 |

వలయువారు:— సరస్వతీ బుక్ డిపో, బెజవాడ.
కృష్ణాజిల్లా.



శ్రీ

# రుక్మాంగద మహారాజ చరిత్రము.

గీ॥ తల్లిదండ్రులు లేనట్టి ధన్యుడెవడొ
చావుపుట్టుక గనరాని సరసుడెవడొ
హెచ్చుతగ్గుల నెంచని యీశుడెవడొ
అట్టి భగవంతు నురుభక్తి నాశ్రయింతు.

## గురుస్తుతి.

కం॥ తగ నాంధ్రభాష గఱపిన
తగవరి పొట్నూరు కుల సుధావార్ధి విధుం
డగు వెంకటసామి మదీయ
గురుని మదిలో దలంతు ననవరతంబున్.

## కవివంశావళి.

సీ॥ ఫలసస్యవృద్ధి సద్వ్యాపారములచేత మనుఅక్కపల్లిగ్రామనిలయుండ
గురుభరద్వాజస గోత్రప్రసావన ప్రభుడు లక్ష్మణదాసపౌత్రకుండ
రహిమీఱ కేశవరామాఖ్యునకు గన్నమాంబకునే ద్వితీయాత్మజుండ
విశ్రుతగాన ప్రవీణుడౌ బాలాప్రసాదుగారికి నే సహోదరుండ
గీ॥ శైలజా హృదయాబ్జ భాస్కరకటాక్ష
వీక్షణప్రాప్త గాన కవిత్వయుతుడ
శ్రీరమేశకథా బోధనారతుండ
నరయు బాలాజిదాస నామాంకితుండ.

## సభావందనము.

సీ॥ రాజశాసనముమీఱక పనుల్దీర్ప నుద్యోగించుచున్న యుద్యోగులార
పలుకులచెలితోడ దులదూగుచున్న గీర్వాణాది భాషాప్రవీణులార

కఠినచిత్తంబుల గరగింప గడు సమర్థతగల గాయకప్రౌఢులార
కలిగినదానితో గడు దృప్తినొంది సత్కృప బీదలనుగాచు గేస్తులార

గీ॥ పాట చదువులయం దల్పపరిచయుండ
నిందుగల తప్పులెన్నక నే వచింప
దలచియున్నట్టి సచ్చరిత్రముల నిప్పు
డాలకింపగ వేడుదు నార్యులార.

( సువ్రతుడు, కదంబుడు దేశాటన జేయుచు )

కద—సువ్రతా ! ఆపట్టణంబెన్నడైన జూచితివా ?

సు—మిత్రమా ! పదియారేండ్ల ప్రాయమున జూచియుంటి నదియే
రుక్మాంగద మహారాజు పాలించెడి విదిశానగరము.

నవరోజు—ఆదితాళము.

1 ఆ నగరపు సోయగమ్ము నలవియె వర్ణింప మనకు ॥ఆన॥

2 దీనజనులు గానరారు । ధీయుతు లచ్చోటివారు
చానలగుణరూపములకు । సరిగా రల సురకాంత
లానారద సద్గానం । బాసింపరు తత్కాంతే ॥లాన॥

3 కూనవయసువారైనన్ । ధ్యానింతురు బాలాజిన్
వేనవేలు ఫలజాతులు । వింత వింతలగు నూతులు
నూనంబులనొప్పు । నుద్యానవనంబుల చొప్పు
నేనా వర్ణింపగలను । దానిచూచి తీరవలె ॥నానగ॥

వ॥ సకల సంపదలచే దులదూగుచున్న

తో॥ ఆవిదిశానగరమునకు బ్రభుడై । యలరె రుక్మాంగదుండు।
భావజజనకుని పాదాబ్జామృత । పానము సేయుచునుండు ।

కద—ఆ మహారాజు ప్రవర్తన యెట్టిది ?

సు—కదంబా ! నే విన్నంతవరకు జెప్పెద నాలకింపుము.

సీ॥ తనరాజ్యమెల్ల మంత్రిని జూడుమని తెల్పి యితరదేశము బోవ నీ

యకొనడు | తాడుగట్టినదాని దవిలియుండునుగాని యితర కాంతలను గన్నెత్తికనడు| సొంతతోటలోని సుమఫలాదుల నాశ్రితాళికి నిడుగాని యమ్మ మనడు | ఎదుటి కల్మినిజూచి మదినోర్వలేక కొండెములాడు వారి చాడీలు వినడు !

గీ॥ ఆర్యజన సన్నుతుండు దీనావనుండు
అర్కకులమండనుండు విద్యారతుండు
క్రూరరిపుఖండనుండు సద్గుణగణుండు
అతనుసమసుందరుండు రుక్మాంగదుండు.

వ॥ మఱియు నీతనిభార్య సంధ్యావళి,

బేహాగ్ — త్రిశ్రగతి.

1 ఆచెలి తంగెడు బూచినట్టులుండు
చూచితీరవలె దాని, కడలి
రాచూలియంశమ్ము బూనినట్లు
దోచు నానూగారు త్రాచు, కొప్పు నాచు ॥ఆచె॥

2 కన్ను లాడులేడి చెన్ను గని కాళ్ళ
దన్ను, గెంపు లీను మోవి, ముక్కు
నెన్న నువ్వుబువ్వ తీవి, యన్ను
మిన్న నాభి సురపొన్న నడుము, సున్న ॥ఆచె॥

3 రూపమున కేమి భూపుత్రి గుణములు
చూపట్టుచున్నట్టి వెలది, బాలా
జీపై గడుభక్తిగలది బీదలు
దాపునజేర దయజూపు నార్తిబాపు ॥ఆచె॥

కద—ఈ మహారాజునకు సంతానము కలదా?

సు—శ్రీహరికటాక్షంబున గొమరుం డుదయింప ధర్మాంగదుడనుపేరిడి
తో॥ తనయుం డుదయింపగ భూపతిమో | దమున సత్పండి
తులకు| నెనలేని పట్టుబట్టల రూకలనిచ్చి పంపె నెలవులకు॥

పిదప పిండివంటలతో నా నిరు। పేదల కన్నముబెట్టి ।
పదిమూరల పచ్చడ మొకరూకయు బ్రతినరునిచేతబెట్టి ।
హద్దులేని సంతోషముతో రాజ్యము పాలింపుచునుండఁగ ।
ముద్దుకొడుకు శుక్లపక్షచంద్రుని పోలిక పెరుగుచుండెఁగ ॥

కద—ధర్మాంగదుండు గుణవంతుడేనా?

సు—నాకు దెలిసినంతవరకు దెల్పెద నాలకింపుము.

సీ॥ ఘనపండితులశక్తి కనిపెట్టదగు తెల్వి నిజగురునొద్దను నేర్చినాడు
ప్రథనవీరుల గర్వభంగంబు గావింప మించు విలు విద్య సాధించినాడు
గంధసింధురతురంగస్యందనాందోళికారోహణల గడిదేరినాడు
అఖిలరాజ్యవ్యవహార మాద్యంతమ్ము స్వయముగానే గనిపెట్టినాడు

గీ॥ వాక్చమత్కృతి గురుడు, రూపమున మరుడు,
ఈవిలో నీరధరుడు, సాహిత్యపరుడు,
మాని, సంప్రీతికరుడు, సన్మార్గచరుడు
ఇట్టి ధర్మాంగదుని మనమెన్న గలమె!

కద—ధర్మాంగదునకు వివాహమైనదా?

సు—ఈతనిభార్య మాళవదేశరాజపుత్రికయగు చంద్రరేఖ.

సీ॥ మగనికి మునులేచి మజ్జనంబొనరించి దినకరు న్భక్తి బ్రార్థింపు
చుండు । విభుడులేచినయంత వినయంబుతో జేయవలసిన సేవలు
సలుపుచుండు । తలలోనినాలుకవలె సాటివారితో నాడుబిడ్డలతోడ
గూడియుండు। పరమేశ్వరుని కథల్ వ్రాసిన సద్గ్రంథముల జూచి తా
బ్రొద్దుబుచ్చుచుండు।

గీ॥ అత్తమామలగని కడుబత్తి మ్రొక్కు—
ఇతరపురుషుల కనుగొన్న నింటనక్కు—
అందమున వేల్పుచేడెల నడగద్రొక్కు—
సజ్జనామరుతరశాఖ చంద్రరేఖ.

## కథా ప్రారంభము.

రుక్మా—ఓ సూతమునివరా! భవద్దర్శనంబున ధన్యుండనైతి.

ఝుంఝూటి – ఆదితాళము.

మునివర కనుమా! మనవి వినుమా మునిǁ
చనువున నడిగితి నా మనమునగల
సందేహము బాపుము దయచూపుము మునిǁ
శుభ్రత్యర్థవిధులు మీరలు శాస్త్రముజూచి యానతిండు నరు
లేయే । కృత్యంబున బాలాజీ । వరదుని కృపారసము
గందురో యఘు నొందరో మునిǁ

సూ—రాజపుంగవా! నాకు దెలిసినంతవఱకు జెప్పెద నాలకింపుము,

తోǁ ధరాధినాథా! వ్రతములలో న । త్యవ్రతమే మొదటిది
పరాపేక్షవిడిచి స్వస్త్రీల జే । బట్టి యుండుట రెండవది
పిదప నేకాదశీవ్రతంబు గా । వింపగలదు లాభమ్ము
ఇదిచేయుచు బై రెండువ్రతమ్ములు । వదలిన నిరర్థకమ్ము.

వǁ మఱియు భూపసత్తమా!

సీǁ దుర్భరసంసార తోయధి దరియింప చిరునావ యేకాదశీవ్రతమ్ము
వ్యసనసప్తకముచేవచ్చు పాపాహికి శిఖిరాజ మేకాదశీవ్రతమ్ము
సౌఖ్యదంబగు స్వర్గసౌధాగ్రమెక్కింప జిగిమెట్టు లేకాదశీవ్రతమ్ము
మాయాంధకారమ్ము మడియింప వేడిజేజేవెల్గు యేకాదశీవ్రతమ్ము
గీǁ చిక్కులెడలించు నేకాదశీవ్రతమ్ము
సిరిని సమకూర్చు నేకాదశీవ్రతమ్ము
చిత్పదంబిచ్చు నేకాదశీవ్రతమ్ము
చిర సుఖప్రద మేకాదశీవ్రతమ్ము.

వǁ కావున మీవంటిరాజు లాచరింపదగినది.

రుక్మా—మునికులసత్తమా! భవదాలాపంబులు వీనుదోయికి నెంత
యో సంతస మొదవించినవి.

ఉ॥ ఓ మునిసార్వభౌమ భవదుక్తములైన వ్రతమ్ములెల్ల నే
నేమముతోడ జేసి భవనీరధిదాటి సమస్త నిర్జర
స్తోమము చుట్టుగొల్వ సిరితో దులదూగెడు నీలనీరద
శ్యాముని పాదపద్మముల సన్నిధి నెప్పుడునుండు హాయిగన్.

సూ—భూపగ్రామణి ! మంచిది. నే నిజమందిరమున కరిగెద.

రుక్మా—మహాభాగ్యము. (బంధువుల రావించి)

కీరవాణి – ఆదితాళము.

ధన్యుడనైతి బాం | ధవులారా! నే ధన్య॥
సన్యాసి యొకసంగతి దెల్పెను ధన్య॥
దశమినాడేకభుక్తముచేసి యేకా |
దశి నుపవసించి మాధవుచరిత్రల నా
నిశియెల్ల జాగరమున జరిపి ద్వా
దశినా డుదయమ్మున సజ్జనులకు
సశనంబిడు వారలు బాలాజి ద|యను బాత్రులుగాగలరనుచు
వింటి॥ ధన్య॥

మంత్రిపుంగవా !

క॥ మనరాజ్యములో నివసిం
చిన జనులీ వ్రతము నెప్డు జేయుటకై శా
సన మంపు డటుల గావిం
పనివారలు దండనమ్ము బడయుదు రనుచున్.

మంత్రి—భూస్వామీ! చిత్తము.

(వెట్టివానిని రావించి యాజ్ఞాపింప వా డేనుంగుపై నెక్కి-
భేరీవాయించుచు)

వెట్టి—జనులారా ! రుక్మాంగదమహారాజుగారి శాసనము వినుడు. దశమినాడేకభుక్తమొనరించియేకాదశినా డుపవాసముజేసి నాటి రాత్రి హరిచరిత్రల నాలకింపుచు జాగరణ మొనరించి ద్వాదశి పారణజేసి శక్తిననుసరించి సుజనసత్కార మొనరింపు డటుల గావింపనివారలు రాజుగారువిధించిన శిక్షకు బాత్రులగుదురు.

(ప్రజలట్టుల నేకాదశీవ్రతమాచరింపుచుండిరి. భూవిభుండు దశమి నాడేకభుక్తమొనరించి యేకాదశినాడు నిరాహారుడై )

రుక్మా—మంత్రిసత్తమా! మన భజనమందిర మేరీతి నున్నది.

మంత్రి—చిత్తము, చిత్తము.

సీ॥ నిజమైన భక్తిచే భజనగావించు వారొకచోట గాయకులొక్కచోట । కోరిన ముత్తాయిదీరు మార్దంగికు లొకచోట నైణికు లొక్కచోట । లయదప్పకుండ తాళమువేయగల్గు వారొకచోట నుద్యోగు లొక్కచోట । కడుభక్తిగుదురు ఘవాక్యములాడు హరిదాసు లొకచోట పండితు లొక్కచోట।

గీ॥ కడుముదమ్మున గూర్చుండ నడుమదైవ
పటము నొక్కటి లక్ష్యముంచుటకు నిల్పి
చెఱుకు పాలు ప్రసాదముల్ సిద్ధపరచి
మీకొరకు జూచుచున్నాము మేదినీశ॥

రుక్మా—మంచిది. నేనువచ్చెదను. (అని భజనకూటమున బ్రవేశించి)

ఫిల్హ్వ—ఆదితాళము.

దేవా! నేవర్ణింపగలనా దేవ దేవ॥
నీవాడగదా భవాబ్ధి నీదజాల దేవ॥
నిన్నునమ్మినట్టివారికోరిక। నెరవేర్పుదు వందురు పెద్దలు॥ దేవా॥
ఈవెరాజసమున బ్రహ్మవై సృజియింపుచుందు వెల్ల విశ్వము
నీవె సాత్వికమ్మున హరివై దయ । నేలుచుందు వఖిలజీవుల
నీవె తామసమున రుద్రుండవై యాల్గింతువు సకలలోకముల్
గావున నీమహిమంబు వర్ణింపగలరే బాలాజీదాసులైన॥ దేవా॥

హంసధ్వని త్రిశ్రగతి॥

అర్పించెద గొనుమయ్యా మహాప్రభో! ప్రభో! అర్పి॥
కర్పూరధూపదీప కనకపుష్పములనే
నారికేళ ఖర్జూర పనస కదళీఫలముల
నారుచవులనొప్పు మంచి పదార్థములను నీకు నే నర్పి॥

విడియ మగరుగంధము నవీనవస్త్రములు
దడయక బీ. బాలాజీ! దాసావన నీకు నే దర్పి॥

(ఈచందమున హరిని భావించి ద్వాదశీపారణగావించి)

రుక్మా—సచివోత్తమా! పురజనులస్థితి యెట్లున్నది?

మంత్రి—నరనాథాగ్రణి!

త్రో॥ ప్రమదంబున శ్రీవైష్ణవులను బారణకొరకై పిలిచెడివారు
కమలనాభునకు భక్తితో నుపహారములు సమర్పించెడివారు
అరుగులపై కూర్చుండి హరికృతుల నసురక్తిని బాడెడువారు
నిరుపేదల బంతులు సాగించి నెనరున నన్నం బిడువారు.

వ॥ ఈ తెరంగున సంతోషాన్వితులై యున్నారు.

రుక్మా—మహాసంతోషము.

ఆనందభైరవి—ఆదితాళము.

రమారమణ ననుగాచుట కిది మంచి సమయమురా॥ రమా॥
సుమాత్రజనక నీసమానులేరి దితి
కుమారహర నుత సమీరకుమార రమా॥
మురా,రి కనికరా— న నిక వరా, లొసగు మని కొనియాడు
దురా, కుధరధరా, వినుతవిదార పరాఙ్ముఖతయేల తండ్రి ॥ర॥
సదా, నీదుపదాం, బుజముల దా, పున నను జేర్పుము బాలా
జిదా, సవరదా, దయగను దా, మోదర మదారి విదార. ॥ర॥

(ఇట్లు హరిభక్తి పరాయణుండై యనేకకాలము ద్వాదశీవ్రతమును సమస్తప్రజలుందాను నాచరించుచుండె॥

గీ॥ శ్రీకరంబగు నేకాదశీవ్రతమ్ము
సంతతము భూపు డురుభక్తి సలుపుచుండ
ప్రియమతి కెక్కెను [illegible]
రహిం బ్రకాశింపుచుండె నా రాజ్యలక్ష్మి.

(నారదుఁడు ప్రవేశించి)

ఝంఝూటి — త్రిశ్రగతి

1 ఆనంద మానందమానందము బ్రహ్మానంద మానంద
మానందము ॥ఆనం॥

2 స్వానుభవమున ప్రపంచస్థితి నిదానించి దేనిని
ధ్యానించుటే ని ॥త్యానం॥

చ॥ కనుగొన రాతియందు గల కప్పకు, నారుల గర్భగోళమం
దున వసియించు బిడ్డలకు దొరవుటన్నము మంచిగాలి జీ
వనము నొసంగి సంతత మపారముదమ్మున బెంచు దేవదే
వుని గడుభక్తితో హృదయపుష్కరమందిడి సేభజించుటే॥యా॥

నిండుపట్టుదలతో । రెండు బొమల నడుమ
పండువెన్నెలరీతి । నుండు జ్యోతిని జూచు ॥టానం॥
తనకు గలిగిన । దానితో సంతృప్తి
గొని బాలాజీని । గొనియాడుటే పర ॥మానం॥

(ఇట్లు భజియింపుచు నారదుండు యమలోకమున ప్రవేశించిన)

యము—మునిచంద్రమా! నమస్కారము.

నార—మార్తాండాత్మజా! కళ్యాణము.

పూరి — రూపకము

జముడా! నీతతముడా!
సమరవిక్రముడా! శివసముడా!
వింతదోచుచున్నది నీ । వీడుచూడ నేడు, దు
రంతపాపుల చేనిండి ని । రయముండె నాడు
కొంతమందియైన నరక । కూపమునం గానరారు
చింతలేదె నీకు బాలా । జీవరద సుభక్తవియుక్త ॥జము॥

యము— శ్రీరాగం — త్రిపుట

నారదా! సంగీతకళావిశారదా! విన్నవించెదవిను ॥మోనార॥

భూరథభజనపవిత్ర । శారదనీరదాభగాత్ర ॥నార॥
క్షితిలోరుక్మాంగదు డన్నృతమాడక యేకాదశీ
వ్రతము జేయుచుండుట నా । గతిసంద రాచరించి
సతతము బాలాజీ వరదుని । సత్కృపాతను మార్జించి స
ద్గతికిబోవుచుండుటనేసతి । కుతుకమ్ముగసినంటనుండు హాయిగా॥నా

నార—(నవ్వుచు) ఏమిచిత్ర మేమిచిత్రము !

ఉ॥ తలపగ మద్యమాంసముల దట్టముగా భుజియించి వారకాం
తలవలలందు జిక్కి తమద్రవ్యము భూముల వెచ్చబెట్టి పి
ట్టలను మృగమ్ములం దునిమి డంబును జేయుచు మూర్ఖచిత్తులై
యిల జరియించు నేలమగలేడ యుదార్థము లేడ నంతకా !

యము—మునిసార్వభౌమా !

గీ॥ మున్నుగల సూర్యవంశపు మన్నుజేడు
లిట్టి యిడుమలజిక్కిన నెన్నడైన
కల్లబలికిరె యిపుడు రుక్మాంగదుండు
దబ్బరలు వాగుటకు నిట్టి తలపుమాను.

యమనారదుల సంవాదము.

ఖరహరప్రియ — ఆదితాళము.

నా—ఇంతమాత్రమ్మున దృప్తిగాదు
అంతకా ! తగు నిదర్శనమీయకనాకు ॥నిం॥

య—మానినాథా ! నామాటవినుము
మానవేంద్రుడు కడు బుద్ధిమంతుడు సుమ్ము ॥మా॥

నా—మాటలేల సందియమ్ముదీరెడు । మార్గంబరయుము లేనిచో నీ
మాటలెల్ల బూటకమ్ముగా నా । మదినెంతుజుమ్మా లెమ్మా॥యి॥

య—కలహమేల మీకునాకు సత్కరుణముతోడ బాలాజీ నేలిన
జలజసంభవుని బ్రార్థించిన మీ । సందియమ్ము తీరగలదు॥మా॥
(అని యిరువురు సత్యలోకమునం బ్రవేశించి)

యము—ఓవాణీ హృదయపంకజ భాస్కరా!

తో॥ అల రుక్మాంగదు డన్నృపమాడడని । పలుక నద్దాని వినక
కలహభోజనుడు నేడు నన్ను మీా । కడకు గొని తెచ్చెను గనుక
అడుగుదమ్ములకు వందనశతమ్ము । లర్పింతు నబ్జజాత!
జడదారికిగల సందియమ్ము ని।ప్పుడుదీర్పు మోవిధాత!

బ్రహ్మ—(నవ్వుచు) ఆత్మజా! అంతకున కెంత శ్రమయిచ్చితివి? రుక్మాంగదుని సంగతి దెల్పెదవినుము.

ఉ॥ ఆతడు దానశీలుడు దయానిధి దీనజనావనుండు శ్రీ
నేతపదాంబుజాతముల నెమ్మదిగొల్చెడువాడు సజ్జన
వ్రాతముగన్న సద్వినయభావము జూపెడువాడు గాన నా
భూతలనాథుడేగతిని బొంకునొ యారయు మోప్రియాత్మజా!

నార—(నవ్వి) జనకా! మీాపల్కులు వింతగ దోచుచున్నవి.

తో॥ అత్యుగ్రులు భూపాలురు నిత్యానిత్య వివేకులుగారు
సత్యము నెంచరు ఘోరకృత్యము సల్పుచుందురు పలుమారు
అమితమ్ముగ సారాయిమాంసముల నాని ధనమదము చేత
సుమశరుబారికినోడి పరస్త్రీసుఖము గోరుదురు ధాత!
కనుక రాజులేడ సత్యమేడ కాదంటివేని జనక
యనుమానము దీర్పకున్నచో నేనైన నమ్మ నంతదనుక.

బ్రహ్మ—సరియే. నీయనుమానము దీరుమార్గమూహించెద.

( మోహినిదేవిని సృజింప నయ్యంగన )

మోహి— బేహాగు—ఆదితాళము.

అజా! యానతిమ్మా నను బుట్టించిన కారణమేమో ॥పద్మజా॥
సుజనవ్రజవృజినసిరాసా । శుభద బాలాజీనాభీరాజీ ॥వజా॥
ఓవాణీవల్లభచూడు నే । గావింపవలసినది నేడు
సావధానముగ దెల్పుముదాని । నపరణజేసెద బొల్పుగ ॥నజా॥

బ్రహ్మ—అమ్మాయీ! మోహినీదేవి!

తో॥ ఘనరుక్మాంగదు డన్నృతమాడడని।యనగ నారదుడు నమ్మ
నని యనుమానము దీర్పుమనగ నే । నినుబుట్టించితి నమ్మ
కాన నీవు ధరణీపతితిలకుని । గాంధర్వమున గ్రహించి
మానికిగల యనుమానము దీఱుపుమాయమ్మయూహించి.

మోహి - యదుకులకాంభోజి -- ఆదితాళము.

ఇటువంటిపనికై నన్నీగతిబుట్టించుట యిదిన్యాయమని
తోచెనా ? అయ్యో నాతండ్రి
జటిమనమునగల సంశయనివృత్తి
నెటులనే జేయగలనో అయ్యోనాతండ్రి॥ ॥యి॥
భూపతిచేతనే బొంకించినచో । బాపమునాకబ్బదే నాతండ్రి
నీపుత్రికనై యీగతినల్పుట । నీతిగాదు మఱియొకమార్గమ్మున
బాపుమతని యనుమానము బాలా।జీ పాదమాన
యీపని నేబూన ॥నిటు॥

బ్రహ్మ—అమ్మా, నీవట్లు సందేహింపవలదు.

మ॥ సతతంబున్గను భక్తితోడ విదిశాత్మనాథు డేకాదశీ
వ్రతముల్ సల్పుచు సత్యసంధుడయి కాలక్షేపముం జేయువా
డతడే నిన్ను వరించెనేని చిరసౌఖ్యంబిచ్చు వైకుంఠముక్
ధృతికై కొందువు దీనిమూలమున సందేహమ్ము నిర్మాలమా
యతికిన్గావున మాటనమ్మి చనుమా యబ్జాత పత్రేక్షణా.

మోహి—చిత్తము మీరానతిచ్చిన తెఱంగునఁగావింతు.

బ్రహ్మ—నారదా ! మోహినీదేవి మందరాద్రితీరమ్మ పంచముఖ తాండవేశ్వరుండను పేరవెలసిన స్వర్ణలింగమును బూజింపు చుండు. నీవేగి రుక్మాంగదు నొద్దబ్రవేశించి నీనేర్పున నారాజ పుంగవును మోహినీ దేవియొద్దకు దోకొనిపొమ్ము.

నార—మహాప్రసాదము. తమరానతిచ్చినగతి గావింతు.

మోహి—(మందరతీరమ్మునం గల స్వర్ణలింగము నవలోకించి)

మోహన - ఆదితాళము.

పురహర నీపదముల నెరనమ్మితి ||పుర||
పరమదయాకర | భక్తవశంకర ||పుర||
నీ, దరిజేరితి ననుభవనీరధి వే| దాటింతు వ
ని, రజనీకరశేఖర నీ, దయ నాపై జూపుదువని ||పుర||
మురదా, నవ రిపునుత | శారద శరద, సమశరీర విదళిత
ద్విరదా, సురబాలాజీదాసవరదా | స్మరహర వినీలకం
ధర, దా, క్షాయణీవరా ! నను బిరాన, గనికరాన గను
పురాణ, పురుష భక్తజనహర్ష విధాయక
తకదధిగిణత, దధిగిణత, గిణత ||పుర||

( అంత నారదుండు మారువేషమున )

నార—ఓ రుక్మాంగద భూవరేణ్యా ! నా పేరు గాయకశిఖామణి, భవ ద్దర్శనమునకై వచ్చితి.

రుక్మా—మంచిది. మీవిద్యాకౌశలమ్మును వెల్లడింపుడు.

నార—చిత్తము. (వీణమీటుచు)

గౌరీమనోహరం — ఆదితాళము.

కావరావదేమిరా నాసామి ||కావ||
ధీవరాత్మవర్తి | భావభవమూర్తి ||కావ||
ఆదిశేషశాయి | న్యాయవర్తనుల
నాదరింతువని వేదవేత్తలగు శ్రీ
బాదరాయణ సు | తాదులు పల్కిన
గాథలు నిజమైన దయ న్బాలాజీ ||కావ||

రుక్మా—ఓ గాయకశిఖామణీ ! నీపాట నాలకించినంత నెనలేని సంత సము గలిగియున్నది. మా యాస్థానము నందుంచ నిచ్ఛ గలదు. సమ్మతమేనా ?

నార—దేవరవారిదయ గలదేని యుండుటకు సంశయము లేదు గాని మందరతీరమ్మునంగల పంచముఖతాండవేశ్వరుండను నామాంతరము గల స్వర్ణలింగమును బూజింపదలంచి వచ్చుచుండ మీ దర్శనలాభము గలిగె. మీ యాస్థానగాయకునిగా నియమించితిరి. నామనోరథము తీరదయ్యె. పదిదివసములు సెలవొసంగితిరేని నాసంకల్పము దీర్చుకొనివచ్చెద ననుగ్రహింపుడు. మీరును చూడదగినదే పమ్మట దేవరవారిచిత్తము.

రుక్మా—మంచిది నేనువచ్చెద. (అని యిరువురు వెళ్ళుచు)

(ముందుముందుకు జని కేలంజూపుచు)

సీ॥ తొగరువాతెరదాని తూపుచూపులదాని మిసమిసలాడు నెమ్మేనిదాని । నిడుముక్కుగలదాని నీటుచెక్కులదాని నవసంఖ్యవంటి కర్ణములదాని । ముద్దుమాటలదాని మోము చందురుదాని తమ్ములనేలు పాదములదాని।సొగసుబొమలదాని సోగకన్నులదాని లతలనేలెడి బాహులతలదాని ।

గీ॥ ఇరులసిరులను దోలు పెన్నెరులదాని
చూడ నింపు జనించు కంచుకము దాని
తగు నగల్ దళుక్కు చీర మేనగలదాని
గాయక గ్రామణీ! అదే కనుము కనుము.

నార—దేవరా! చూచితిని. దీని జగన్మోహిని యనదగు.

రుక్మా—(మోహినిని జూచి) తలోదరీ!

ఉ॥ చక్కదనాన వేల్పుదొరసానులు నీసరిరారు లేమరో
మక్కువతోడ నేను పలుమాటలు మాఘను బాడుచుంటివే
యెక్కడ జన్మభూమి మగ[illegible] బదుగులేడ గన్నవా
రెక్కడ నీయరణ్యమున కెందుకు వచ్చితివ ? వచింపుమా.

మోహి— హిం. కాఫీ – ఆదితాళము.

భూపా! మార్తాండవంశ ప్రదీపా!కనుమా యిటువినుమా॥భూ॥

నాపేరు మోహినీ దేవి యంద్రదు । నలినసంభవుని
యనుగుబిడ్డనో ॥భూ॥
మగడు లేడు నాకు నింతవర కీ। మగువలెల్లనాదు చెలిమికత్తెలు
మిగుల సంతసంబున విహరింపుచు । పగలు రేయి గడుపుచుంటి
నిచ్చట ॥భూ॥
నాజనకుం డీగహనమున బా । లాజీ నేలిన తాండవేశ్వరుని
బూజించిన నిత్యానందపదవి। వే జేకొందువనంగ వచ్చితిని॥భూ॥

రుక్మా— (మోహినీదేవిని జూచి మోహభ్రాంతుడై)

ఉ॥ నీ నెనరీటు నీ సొగసు, నీ రసికత్వము నీ విలాసముల్,
నీ నవమోహనాకృతియు, నీ యెలప్రాయము, నీదు గానముల్
నీ నయభాషణముల్, కరుణ, నీగురుభక్తియు, చూడ చిత్రమో
మానసవల్లిలలామ! యనుమానము బాయగ నాలకింపుమా.

ఝంఝూటి – ఆదితాళము.

చూపు నామీద నోచిన్నదానా! దయ ॥చూపు॥
పాపిమదనుడు నేడు పూని । తూపులేయుచున్నాడు ॥చూపు॥
కద్దు కనుసన్నలిమ్ము నాకడకు వేగరమ్ము
ముద్దులు గైకొమ్ము కోపి। మోవి నొక్కనిమ్ము దయ ॥జూపు॥
కపటవృత్తిమాని నీ కౌగిట నన్నూని
కృపనేలుము రాణి వి । విపుడవుమవుగాని దయ ॥జూపు॥
జాలమేల బాలా! నవ । నకు రా నన్నేల
తాళజాల బాలాజి । బాసుడ నీవేలదయ ॥జూపు॥

మోహిని— ఆనందభైరవి – త్రిపుట.

మగవారి నమ్మరాదు । జగమున నసవాదు వి
ధిగవచ్చు దబ్బరగాడు నం । దనుడు లేడు
మగువ లోకువ్వాడు రమ్మని నన్నయ। ముగ బిలిచిన నిరాకరించి
తగువారలతో నగుబాటుల కెడమగునట్టుల చేయుదురు
కలనైన ॥మగ॥

బింకముతో నున్న పంకజాక్షులగన్న నే
వంకనైనగాని వారి | వశము జేసికొని
యంకమందు జేర్చివారి | యవసరంబు దీర్చుకొని
చంకవేగ దిగిపొమ్మందురు | సార్వభౌములైన
బాలాజియైన ||మగ||

రుక్మాం— హిం. తోడి - ఆదితాళము.

ఏలవే బిగికౌగిటలోన ||న్నేల||
వాలుగంటి పూల | పాన్పున జేర్చిన న ||న్నేల||
అనుకంపవీడి | య సుమసాయకుడు
ననుబాధింపు చు | న్నాడే యన్ను మిన్న ||యేల||
అరమరలేల రా | జ్యమంతయు నీ
పరము జేసెద మూదు | బారి నోర్వజాల ||యేల||
పలికి బొంకుటలేదు | బాలాజి పాదమాన
కలహంసగమనా న | న్నామ శాస్త్రవిధి ||నేల||

మోహి— కమాచి - ఆదితాళము.

ఏల యిట్టి మోహంము భూ ! పాల తిలకా! ||యే||
చాలు చాలు దొంగవలపు | తాళు తాళుమా ||యే||
గరితమిన్న లజూచి | కడుముదమున లేచి
నెరవుచుందురు ప్రేమ | నిలయము జేరుదాక
తరువాత నాపిలువగ నూతన స్త్రీలకై
మరలిపోదు రోరి మోము లిడి మగ | వారల
నమ్ముట తెప్ప కడుముప్పు
నా మాటమీరనట్టి | సరసి కరము బట్టు
మామక వ్రతనుట్టి | మగని గూడ్చుటకునై
కామించి బాలాజిని | ప్రేమించినట్టి దేవుని
నియమముతో సేవింపుచుంటిని| నీ వెక్కడ సత్యమ్ము లెక్కడ ||యే||

రుక్మా—అంగనా! నీమాటలు కడుచిత్రముగ నున్నవి.

చం॥ ఇనకులమందుబుట్టి నుతికెక్కినరాజులు కల్లలాడుటల్
వినికనియుంటివే యిట నవీనపుమాటలు వింటి నక్కటా!
చనదిటులాడ శంకరుని సాక్షిగ బల్కుచునున్నవాడ జె
ప్పినగతి సంచరింతు మురిపింపక కోరికదీర్పు మంగనా!

మోహి—మార్తాండవంశప్రదీపా!

తో॥ నాయాజ్ఞ దాటననుచు నే డీపినాకినెత్తిపై ముందు
చేయియుంచి యొట్టుపెట్టు మట్టు పై చేదామరగ్గై కొందు.

(అనవిని రుక్మాంగదుడు స్నానంబుగావించి శివునిభావించి)

తో॥ హరునియడుగుదమ్ములాన విను నీ । యాజ్ఞదాట గజయాన
అరమరలెందుకు నను నీకౌగిట । నాదరింపుము బిరాన॥

మోహి— కమాచి—ఆదితాళము.

మంచిదిలే సార్వభౌమ! ॥మంచి॥
పంచముఖేశ్వరుని చెంత గాంధర్వమున గ్రహింపుము
గమనింపుము ॥మం॥
ఆడి తప్పననుచుబల్కి పెట్టిన । యానని జంబేకదా మనోరథ
మీడేరినదింక సంశయము । నీకేల తపనతేజా! రాజా! ॥మం॥
భానువంశజాతులు బాలాజీ । పై బ్రపత్తి వీడక బొంకాడక
మాననీయులై కాలముగడిపిన।మాటలు మునువింటిగంటి॥మం॥

(నేలదొర పరమహర్షంబున స్వర్ణలింగమును సమీపించి)

ఆనందభైరవి – ఆదితాళము.

లింగా! నను గావర వృషభతురంగా! ఘోరపాప పవన భు
జంగ భస్మాంగ సాగరనిషంగ ॥లింగ॥
మంగళాంగ మౌని హృదయపద్మప।తంగ పర్వతాత్మజాధిపా!
భుజంగభూష పురదానవగర్వవిభంగా! భక్తావనాంతరంగ॥లింగ॥
రారా శతకోటిమన్మథా।కార భక్తమానస మందారా

మేరుధారుణీధర । ధీర
నీరజనయన నీ వాచారము నీనటనము నుదిసి సన్మిత్రతిని
నీరజారి శేఖర రిపుభీకర । వారణాసురాదిదనుజ గహానకు
తారక వేదసార సకలజీవాస్థార సంసార భారనివారణ ॥౬౦౯॥
వాదా యింకనైన నీదయ । రాదా పతితపావన బాలా
జీదాసా! నినునమ్మియుండలేద యు
మా దయతో వినుమా దయనుగను । మా! వలదనుమాన మిక
బీదలపై కనికరముంచి న్యాయ । వాదులై సంసార సాగరము
నీదువారు నీపదయుగ బాత్రులవుదురంటు రో దయాసముద్ర॥

( ఇట్లువినుతించి మోహినిదేవిని గాంధర్వమ్మున బరిగ్రహించి )

రుక్మా—మదీయహృదారామసంచారిణీ! మోహినీ! చూడుము.

ఉ॥ తమ్ములనేలువాడు కుముదమ్ములకుంబగవాడు జక్రవా
కమ్ములదాల్చువాడు నరకప్రభుమందుల గన్నవాడు కా
లమ్మును దెల్పువాడు తిమిరమ్మును జిమ్మెడివాడు భక్తవ
ర్గమ్మును బ్రేమతోడగను గాముల రేడపరాబ్ధిలో బడెన్.

దేవీ! అల్లదే కనుంగొనుము.

ఉ॥ నల్లనివన్నె మిన్నరపునం బెలిరిక్కల మల్లెమొగ్గలం
జల్లి తమీసరోజముఖి నాథుని రాకకు వేచియుండగా
మెల్లన పూర్వదిక్సతి తమిన్నగవేరిచి తకుణంబ జా
బిల్లి యనూనరాగమున బ్రేయసితో విహరించుచుండుటల్.

మోహి—వల్లభా! నన్నీదోషాకరుం డెంత బాధింపుచున్నాడు.

రుక్మా—దేవీ! యోర్చుమీనీరజారాతిబింకంబణగింప ప్రయత్నించెదను.

(కొక్కోకశాస్త్రవిధి నిర్వాహ సంతోషాయత్తచిత్తులై యుండ)

సీ॥ జక్కవకవమీద జుక్కలు పదిటొంచె నగ్గమ్ముపై నొక్కలట్టిలేచె
అలదొండ మల్లిమొగ్గల సందునం డాగె మీనుల మీద తు

మ్మెనలుజోగ | అనటికిజోదిపుల తాపురదూండ్లు బంధించె పాము చీమలమీాద బవ్వలించె | అనని యిట్టటులనల్లాడగాజొచ్చెనింగిని తాబేళ్ళు నిగిడిపోచ్చె |

గీ॥ అద్రిశిరములు పెసరకాయలకులోంగ
చలువతేనిలో నల్లమచ్చయు గరంగె
రుచిరచూర్ణకుంతల పీథి రూపణంగె
ఱేడు మోహినితో జతగూడినంత.

రుక్మా—బ్రహ్మమానసపుత్రీ! అదిగో విలోకింపుము.

చ॥ ఇలను కుముద్వతీసతి నిజేశునితో సుఖమొందుచుండ న
ప్పడతిని జూచు తమ్మిచెలి వల్లభుడుండిన నెల్లసౌఖ్యముల్
గలుగకపోవునే యని మొగమ్మును వంచి గ్రశింప నత్తరిన్
దొలిదెస నా దివాకరుడు దోచె నిజాంగన సంతసిల్లగన్.

కావున నిజమందిర మలంకరింతము.

మోహి—దేవరవారి చిత్తము.

(భార్య వెంటనంటిరాగ నిజపురముజేరి)

రుక్మా—ఆత్మజా! ధర్మాంగదా! యీమె బ్రహ్మమానసపుత్రి. పేరు మోహిని. గాంధర్వమున గ్రహించితి. నీకు బినతల్లిగావున నొక్క యుచిత సౌధమ్మున నుంచుము.

ధర్మా—మహాప్రసాదము. మహాప్రసాదము.

(పినతల్లికి ననుస్కరించి యొక గమ్యసౌధమ్మున నామె నుంచెను.)

రుక్మా—పట్టపుదేవీ! సంధ్యావళీ! నేను మందరగిరమ్మునంగల స్వర్ణ లింగమును దర్శింపనెంచి యచ్చోటికింజని చెవులపండువుగబాడు చున్న విధాత నందనయగు మోహినీదేవిని మారుని బ్రేరేపణ మున చెప్పిన యట్లొనర్తునని ప్రమాణముజేసి గాంధర్వమున

స్వీకరించితిని నేకనిముసమైన నామెను విడిచియుండ వీలులేదు. గాన నీవింకొకరీతి నాలోచింపక నాముద్దుచెల్లింపుము.

సం—నాథా! తమచిత్తము. ఆమెదయ యెట్లున్ననుసరియె!

గీ. మగడువేరొక్క కాంతను మరగి రతులు
సలుప నిజకాంతచూచిన సైపవలయు
అటులజేయక వ్యతిరేకమైన దాని
యముడు దండించునని పెద్దలనుట వినమె.

(అని సంధ్యావళి నిజమందిరముజేర నీమెచెలికత్తె కుముద్వతి)

కుము—అమ్మా! సంధ్యావళీ!

ఆ॥ వె॥ నగలనీయవచ్చు నాణెంబులీవచ్చు
బలిమినీయవచ్చు బ్రాణమైన
నన్యకాంతతోడ నధిపుం గూడిన
జూచి యోర్చుటెట్లు సుందరాంగి.

అమ్మా నీవు గనుక శాంతించితివిగాని మాబోటివారమైనచో నెట్లు జేయవలసియుండునో యట్లు గావింతుము.

సం—(మిగుల రోషముతో) కుముద్వతీ!

కమాచి - ఆదితాళము.

సరిలే నెచ్చలీ! సరి ॥సరి॥
తరచు యిటువంటిమాటలు నాచెవి జొరనీయవద్దు
మోసమ్మొకద్దు
మగడేగతి దిరిగిన దిరుగని । మగనిసేవయె స్త్రీలకు మోక్షమె
నగుగావునబాలాజీదాసు। లెరుగుదురు దీని మరుగుని.కనరుగు॥సరి॥

(కఠినముగా జెప్పినమంచిది. దీనిపనిబట్టెదనని మోహినిచెంతకేగి)

కుము—అమ్మా! బ్రహ్మమానసపుత్రీ! లోకములో మగరాజు లెందరినో చక్కబెట్టెదరు. నీవు మాయేలికను వశపరచుకొని తనము

ఖమేచూడనీయులేదని యెంతయో నిందింపగ విని మనమోర్వక వచ్చి విన్నవించితి.

మోహి.—(నవ్వుచు) సంధ్యావళి సాధ్వీమణి. నన్నేల నిందించును? ఈమె దేవితో నేదియో చెప్ప నామెకోపించినందున నాకోపము నకు బాత్రురాలగునట్లు జేయందలంచి వచ్చి యిచ్చకములాడుచున్నదిగాని దీని మృదువుగానంపించి సంధ్యావళి శాంతస్వభావమును లోకమునకు వెల్లడిజేసెదను. (ప్రకాశముగ) కుముద్వతీ!

ఉ॥ ఏవిరిబోణి నన్ననుట లెందులకో తన దాడుజన్మ కా
దో వలపింప నేర్పెరుగదో తనకౌగిటలోన నుండగా
నోవిదిశావనీప ! దయయుం చిటురమ్మని బల్కి హస్తరా
జీవముబట్టి నావిడిది జేర్చితినా ! సరసీరుహాననా !

( అని కుముద్వతిని బంపించి )

మోహి.—రాజా ! మీపట్టంపుదేవిచే నుపచారములు చేయించుము.

రుక్మా.—దేవి! నీయిష్టానుసారము గావింతును. (అని భార్య దరి కేగి)

రుక్మా.—దేవీ సంధ్యావళీ! నీచే బరిచర్యలంద నుద్దేశించి నన్ను గోరినది. మరియొకరీతి నాలోచింపక నాముద్దు చెల్లించుము.

సం.—మహాత్మా! తనకిష్టమయినయెడల సందేహమేమి? (అని మోహినీదేవిని సమీపించి) అమ్మా! బ్రహ్మమానసపుత్రీ! మీకు నుపచారములు చేయువలసినదిగా భర్తయాజ్ఞయయినది.

మోహి.—సంధ్యావళీ !

సీ॥ మేము లేవకమున్నె మేలుకొని గోరువెచ్చగా కాగులో నీరుగాచ
వలయు | లేచి స్నానసంభావించువేళకు పంచభక్ష్యాన్నములు
సిద్ధపఱచవలయు | సాపాటుగావించునపటికి కప్పురగంపు విడెము
ముడుసగి పక్క వేయువలయు | పక్కపై బవళింప పాద
యుగ్మముబట్టి పవన చేబూని విసరవలయు |

గీ॥ మాకు నిదురుబట్టిన బైకిబోయి
సందపడుటకు ముందుగా నిండుపవచ్చి
మిక్కటంబగు సక్కర దక్కపనుల
బాగుగాదీర్చి యింటికి నేగవలయు.

సంధ్యా—అటులనే గావింతు (అని చెప్పినట్లు చేయుచున్నంత నేకాదశీవ్రత మాచరింపుడని చాటించిన ధ్వని రాజువిని పక్కనుండి లేచి యొకచోట జేర)

రుక్మాం— తోడి — ఆదితాళము.

కడ తేరరాదా మనస ॥కడ॥
గుడికొన్నారు । గురి సంగలను
సడలించి హరి - యుడుగుల నమ్మి ॥కడ॥
ధనధాన్యములు ! బాంధుత్రాదులు
వెనురారు బాలా । జని నెనసమ్మి ॥కడ॥

మోహి—ప్రియుడా ! నూతనచర్య గానవచ్చుచున్నదే !

రుక్మా—ప్రాణసఖి ! చిరకాలము నుంచి యేకాదశీవ్రత మాచరింపుచుంటని గాన రేపు దాని నాచరంపదలచితి.

మోహి—రాజరాజా ! రెప్పపాటైన మీపక్కబాయజాలని దానను మూడుదినమ్ములెట్లు విడువగలను ? గాన్పున నాచరింపవలదు.

రుక్మా— హిం. తోడి - ఆదితాళము.

ఇటువంటి పట్టుదల యేలనే ? సీకబలా ! ॥యిటు॥
కుటిలాలకలు భర్త । కోరిన చందమును
నటియించిన పెద్దలా । సందియించిరి జనమ్మా ॥యిటు॥
ఎవరైన మంచిపనిక । హెచ్చరించిరి గాని
కువలయగంధీ ! చెడ । గట్టునుండి లుండురు ॥యిటు॥
నిన్నుపిడినాడి పరిసీలవేణుల గూడిన

నన్ను నిందించుటది న్యాయముగాని ॥యిటు॥
పరిపాలిత బాలాజీ । పౌత్రివయ్యు నీ
వెరుగని ధర్మాధర్మము । లెంచుగలవో చెప్పుమా ॥యిటు॥

మోహి.—  బేహగ్ — ఆదితాళము.

చాలునిటులనుట మీకు న్యాయమా ? కాయమా ? ॥చాలు॥
ఆలోచింపుము దూరముగా భూపాలా చూడు
నాతో యేమంటివో ॥చాలు॥
చెప్పినయట్లు గావింతునని నాతో । జెప్పి యాన బెట్టలేదా
యాడితప్పుట లిది మర్యాద వ్రతము
నప్పుపూసిన నొప్పు బట్టుదప్ప ॥చాలు॥
వ్రతములెల్ల సంసారులకుగాని మీ।వంటిరాజులకు గాదు
క్షితినాయకుల నంతమందు యమ।శిక్ష బాధింపకపోదు భూ
పతితిలకా ! రాజ్యాంతే నరకం ధ్రువ ంబను మాట వినలేద ! ప్ర
స్తుతసౌఖ్యమనుభవింపక యెన్నడో । సుఖ మబ్బుననియే దు
ర్మతులనిరో యది నిజమా పా।లితబాలాజీ నీదు సూ
నృతమునకు మెచ్చగలడాడిన।గతినినాతోడ గూడుచూడు నేడు॥

వ॥ వ్రత మాపుడు. పరిగ్రహించుటకు మున్నేమని చెప్పితిరి ?

క॥ బొంకిన బున్నెము దఱుగును
బొంకినచో గీర్తికాంత [illegible]
బొంకిన నిందలు గలుగును
బొంకకు [illegible]

తే॥ [illegible]
[illegible]
[illegible]
[illegible] !

వ॥ మరియు బరిణయకాలమ్మున మీకీవ్రతఃములు గలవని చెప్పితిరా? నన్నంగభవుబారికి నప్పగించనేల? చెప్పినరీతి గావింపుడు.

(రుక్మాంగద మోహినీకాంతల సంవాదము)

ఫీల్వ — త్రిశ్రగతి.

రు—పడతిమిన్న! వినుమా యీ | వ్రతము నల్పమనుమా ॥పడ॥
విడువరాని దీ వ్రతమ్ము | వినుమా దయగనుమా ॥పడ॥

మో—చెప్పిన చందమున జేసెద ననుచు ముదమున
నప్పుడనగలేదా యటు | లాచరింపరాదా!

రు—వినుము దేనినైన గావింతు జలజనయన
అనుమతి నీవ్రతముసేయ | నాపుమా యనూయ ॥పడ॥

మో—వ్రతముమాటకేమి నీ | వాక్కులంత విలువా? సూ
నృతము దప్పవంటివి | నీసుతుని జంపగలవ ॥చెప్పి॥
(రుక్మాంగదుడేమియు ననజాలక విన్నబోయియుండ)

ధర్మా—తండ్రీ! విన్నబోవనేల? నా సవతితల్లి కోరిక నెరవేర్పుము.

ముఖారి — ఆదితాళము.

ఏమిభాగ్యమో నాతండ్రీ! ॥యే॥
తామసనిర్మాల సత్యవాక్పరిపాల ॥యే॥
జ్వరపాండురోగాదులచేత మేనుదొరగుటకన్న సూనృతవ్రతము
కొఱకు దేహము గూలిన బాలాజీ | వరదుని కృప
వచ్చు నిక్కముగ ॥యే॥

వ॥ సూర్యవంశసంభూతులు సూనృతమువల్లనే కదా వన్నె కెక్కిరి మఱియు మహామహు లంద రాయాసములేని మరణము దైన్యములేని జీవనము కొఱకేగదా ప్రయత్నించిరి. నే నెట్టి నోము నోచితినో యనాయాసమరణము తటస్థించనై యున్నది.
(కొమరుని ధైర్యమునకు మెచ్చి చంప నుద్దేశించియుండ)

సంధ్యా—(సవతి కేల్గవబట్టుకొని) అమ్మా! బ్రహ్మమానసపుత్రీ!

ముఖారి—ఆదితాళము.

ఆలోచింపుమా నాతల్లీ, నే ॥డాలో॥
యేలోకంబున నిట్టివింతగలద ॥యాలో॥
మనమొక్కని కేగద । మనుచు నుంటి మమ్మ
తనయుని జంపించ । దగదు తగదు సుమ్మా ॥యాలో॥
కడుపున నేనుగంటి । గంటను నీవు గంటివి
తడయక నాకు పుత్రి । దాన మొసంగుము ॥ఆలో॥
నాకొడుకు గాడమ్మ । నీకొమరుడు జుమ్మా
లోకములో నిందలో । మునుంగకు మమ్మా ॥ఆలో॥
మనకుల ముద్ధరింప । దనయు డొక్కడె జుమ్మ
విను మలనాడు మనకు । వీడె యాధారమమ్మ ॥ఆలో॥
తిరుగరాని భూములు । దిరిగి వీనినిగంటి
గరితమిన్నా! బాలాజీ । వరదు డెరుగుజుమ్మా ॥ఆలో॥

(ఇట్లు ప్రార్థించిన మోహినీకాంత సమ్మతింపమి)

సంధ్యా—నాథా! ఎంత బ్రతిమాలిన మోహినీదేవి సమ్మతింపదయ్యె, నెవ్వరికి మున్ను పుత్రశోకము బెట్టితినో నిప్పు డనుభవింపవలసి వచ్చినది. శరీరము క్షణభంగురము. కీర్తియే స్థిరమగునది. కావున దాని యిష్టానుసారము జరిగింపుడు నే నరిగెద.

సంధ్యా—పుత్రికా!

హిం. భై.—రూపకము.

నీకు నాకు గల ఋణమ్ము నేటితో దీరె నాతండ్రి ॥నీ॥
శోకింప నేల యశోధనమే స్థిరమైనది ॥నీకు॥
ఆ లతాంగిని బ్రార్థింప । నంగీకరింపదయ్యె
బాలాజీవరదుని కృ । పారస మిాగతిగలదు మనపై ॥నీకు॥

సీ॥ కడుభక్తి నుదయాన నడుగులపై జేతులిడి నాకు మ్రొక్కు వా
రెవరుకొడుక । నా యిష్టమారసి తీయని ఫలములనెంచి పంపించు
వారెవరుకొడుక । నోరార నమ్మాయనుచు బిల్చి ఏనుదోయికి
మోదమిచ్చు వారెవరు కొడుక । కొడుకు లెందరటంచు కోమలు
లడుగ నే నలవారితోడ నేమందు కొడుక ।

గీ॥ నిండుముదమున తొమ్మిది నెలలు మోసి
బాధపడి, కని, నిన్నింతవాని జేసి
నాన్న ! సవతి పాల్జేసి నిన్ను బాసి
అకట యెట్లుందు నీ మీది యాసద్రోసి.

ధర్మా—అమ్మా ! సంధ్యావళి !

ఉ॥ ఏడువకమ్మ నీసవతి నెన్నడు దూషణసేయకమ్మ నా
తోడజరించు బాలకులద్రోరపు ప్రేమను జూచి నేనుగా
జూడగదమ్మ నన్దలచి శోకసముద్రమున న్మునుంగు నీ
కోడలిదుఃఖమాపు మిదిగో కొను నా కడసారి దండముల్.

కుము—అమ్మా ! చంద్రరేఖా ! మీపిన్నత్తకోరిక దీర్పనెంచి మీ
మామగారు తనపుత్రుని వధింప సమకట్టియున్నారట.

చంద్ర— అసావేరి—ఆటతాళము.

అయ్యయ్యో నేనెంత । యదృష్టహీననైతి ॥అ॥
తొయ్యలి నాకేమి । తోచకున్న యది ॥అ॥
మున్నెవ్వరికి యెడబా । పులు జేసియుంటినో
నన్నిట్టి యాపదలో । నలువ ముంచివేసె ॥అ॥
దుడుకు మోహిని మ్రొ । త్త్యువయ్యె నాపతికి
నడవి కాచిన వెన్నె । లయ్యె నా వయసు ॥అ॥
బాలాజీవరదుఁ డీ । లీల గావించినా
డీలోకమున నున్న । నేమిలాభమింక ॥అ॥

సీ॥ మోహనుజూపుటకున్నె ముత్తైదువులు రాగ వారినెమ్మోము
లేవరుసగందు । చిలువ సొమ్ములు వస్త్రములు చందనాదుల
నిక నెవ్వరిని దెచ్చియిమ్మనందు । పతులతో నాపాటి సతులు
ముచ్చటలాడుచుండగా జూచి యెట్లోర్చియుందు । పెండ్లివేళల
సాటి ప్రియురాండ్రు దిరుగ నేపగిదిని జరియింతు వారిముందు

గీ॥ అక్కటక్కట యిటుమీద నంచులేని
బట్టనెమ్మేన నే నెట్టు కట్టుకొందు
మూడుపూటలు కలమాన్నము దినుదాన
నేకభుక్తమ్ము సేయుచు నెట్టులుందు.

(రుక్మాంగదుండు పుత్రుని మోహినీ దేవి యెదుట నిలిపి కరవాలముత్త
చేబూని కంట తడి బెట్టి పురజను లందరు జూచుచుండ)

ఉ॥ ఓరికుమార! నిన్విడిచి యొంటిగ నేగతినుందు నక్కటా
ధారుణిలోన నే బలికి తప్పినచో నపకీర్తివచ్చు నం
చారసి నాదు కత్తికిపు డౌదల దత్తముజేసి మోహినీ
దారుణవాంఛదీర్ప గడుధైర్యముతో సమకట్టి నా వహా!
మారశరీర! నీ సరికుమారుడు గల్గునె యెన్నిజన్మముల్
కోరి హరిన్భజించినను కోట్లకొలంది ధనమ్మునిచ్చినన్
నేరము సేయ నెప్పటికి నిన్వధియింపగ రాజనీతియే
కారణమయ్యె నాకరయుగ మ్మెటులాడును పుత్రరత్నమా.

ధర్మా—నాన్నా! మీ రెంతయు విచారింపవలదు. మీ రెఱుంగని
ధర్మాధర్మములు గలవా? (అని హరిని భావించి)

ధర్మా— కాంభోజి - ఆదితాళము

సీదయచేతనే ధన్యుడనైతి దేవ ॥సీ॥
ఆదిత్యసమ తేజా! యాశ్రితకల్పభూజా ॥సీ॥
సా, మీగా సంసా, రమనియెడిసా, గరమునను సంతతముండక

సత్వరముగ నీ సన్నిధికి జేరన, మయమమ్మెను న, న్మానిత బాలాజీదాస॥

సీ॥ జనకపుత్రికతోడ సరసనల్లాపము ల్గావించునాడు శృంగార రసము। నీరూపమును జూచి కోరి శూర్పణఖ నిన్నాశ్రయించిన నాడు హాస్యరసము। పగవాని సోదరుండగు విభీషణుడు నీ దరికి వచ్చిననాడు కరుణరసము। ఘనసముద్రముమీద గినిసి లక్ష్మణుచేతి విల్లందుకొనునాడు వీరరసము। ఖలుతాటక సుబాహు ఖరదూషణాదుల బడగొట్టునాడు భీభత్సరసము। భండనంబున లక్ష్మణుండు మూర్ఛిల్లిన నాడు దుర్భరభయానక రసమ్ము। అంతఃపుర ద్రోహియైన రావణుని శీర్షములద్రుంచిన నాడు రౌద్రరసము। ప్రాణముల్లేని పాషాణమునకు బ్రాణ ముల నిచ్చునాడు నద్భుత రసమ్ము। పట్టాభిషేకోత్సవము మాని యడవికి జనుమన్న చనునాడు శాంతరసము।

గీ॥ పూర్ణముగజూపి సత్కీర్తి బొందితీవు
అందు మూడవదాని నాయందుబరపు
మనుచు నిన్నాశ్రయించితి నబ్జనేత్ర
దశరథేశ్వరపుత్ర సీతాకళత్ర.

(ఇట్లువేడ శ్రీహరి, పినాకిపితామహులతోవచ్చి)

హరి—(రుక్మాంగదుని కేల్వట్టి)

ఫిల్హా—ఆది.

కరవాల మాపు ధరణీనాథా! ॥కర॥
నిరుపమదయాకర। నిజముదెల్పెద ॥కర॥
క్షితిలోన నీకీర్తి। చెన్నొందుటకై యా
గతిగావించె। నీకంజాసనుడు ॥కర॥
మాహీంద్రుని యను। మానము దీర్ప నీ ॥కర॥
చానను బంపించె। జలజభవుడు ॥కర॥

వ॥ కావున నీసత్యప్రవర్తనకు మిగుల సంతసించితి నీ వడుగ దలంచిన కోరికల నడుగు మొసంగెద.

రుక్మా—(చేతులు జోడించి)

సీ॥ అనసూయదరి బిడ్డలై సోదరన్యాయ మతిభక్తి నెరవేర్చునట్టివారి
పృథితసారధి బాణరధికులై త్రిపుర దైత్యవినాశ మొనరించునట్టివారి
విపులసృష్టి స్థితి విలయకృత్యములకు నధిపతులై జేయునట్టి వారి
సంధ్యాత్రయమున భాస్కరుని మధ్యమ్మున నిండు వేడుకతోడ
నుండువారి।

గీ॥ నేకముఖమున దర్శింపనిపుడు నాకు
లభ్యమైనది నా శరీరమ్ము నేటి
తో బవిత్రమయ్యెను కృతార్థుడనైతి
వాక్సతీ, రమా, పార్వతీ భర్తలార!

హరి—ఓసార్వభౌమా! యింక కొంతకాలము భూలోక సౌఖ్యమనుభ వించి పిమ్మట మా నివాసమునకు రమ్ము.

( అని త్రిమూర్తులు వారి వారి లోకములకుం జనిరి. )

నార—రుక్మాంగద భూపవరేణ్యా! నీకీర్తి లోకమున వ్యాపించుటకై యీరీతి గావించితి నిట్టి శ్రమకలుగ చేసినందుకు క్షమింపుము.

రుక్మా—నారదమహానీంద్రా! మీదయారసమే త్రిమూర్తుల దర్శనము చేయించినది. ధన్యుండనైతి.

మో—ప్రాణేశ్వరా! నాజనకుని యాజ్ఞచే నీమానసత్తముని యను మానముదీర్పనెంచి యిట్టిశ్రమ కలుగజేసితి నందులకు మన్నిం పుము. అక్కయ్యా సంధ్యావళి! మీ శాంతస్వభావమును లోకమ్మున వెల్లడించుటకై నాసేవకై నిన్ను గోరియుంటిని గాని మరియొకటిగాదు క్షమింపుము.

నాయనా ధర్మాంగదా ! నీ పితృభక్తి లోకులకు దెలియుటకై నీగతిగావించితి. మరియొకరీతి నాలోచింపకుము, మీ తల్లిఁ వేరుగ నన్ను వేరుగ దలంపకుము.

శ్రీ మంగళం మంగళం మంగళం

సమాప్తము.



బీ. బాలాజీదాసుగారిచే రచియింపబడిన హరికథలు

# ప్రకటన



| | | |
|---|---|---|
| 1 | సంపూర్ణరామాయణము అచ్చులోయున్నది | రు 1—4—0 |
| 2 | కుశలవ విజయం | 0—6—0 |
| 3 | గయోపాఖ్యానము | 0—6—0 |
| 4 | శశిరేఖాపరిణయము (హరికథ) | 0—6—0 |
| 5 | జయప్రద లేక పురూరవ | 0—6—0 |
| 6 | త్రిశంకు విజయము లేక హరిశ్చంద | 0—6—0 |
| 7 | నలచరిత్ర | 0—6—0 |
| 8 | సీతాకళ్యాణము | 0—6—0 |
| 9 | రుక్మాంగద లేక ఏకాదశీ మహాత్మ్యము | 0—6—0 |
| 10 | దయాకర విజయము | 0—6—0 |
| 11 | సూరదాసు చరిత్రము | 0—6—0 |
| 12 | ద్రౌపదీమానసంరక్షణము | 0—4—0 |
| 13 | పురందరదాసు చరిత్రము | 0—4—0 |
| 14 | కర్ణానందదాయిని (పద్యములు) | 0—4—0 |
| 15 | హరికథేతి హాసమంజరి మొదటిభాగం (పద్యములు) | 0—4—0 |
| 16 | డిటో 2 వ భాగం (కీర్తనలు) | 0—4—0 |
| 17 | కుచేలోపాఖ్యానము | 0—4—0 |
| 18 | రామదాసుచరిత్ర. చల్లా రామలింగయ్యగారి విరచితము | 0—4—0 |
| 19 | ప్రియంవదాచరిత్రము | 0—4—0 |

వలయువారు:—

## సరస్వతీ బుక్ డిపో, బెజవాడ